# శ్రీ సీతాపతేశ్వర స్తవము





రచయిత

“ కర్మశ్రీ ”

ఓం నమశ్శివాయ

# శ్రీ నీలాచలేశ్వర స్తవము

రచయిత

"కర్మశ్రీ"





ముద్రణ

శ్రీ కమలా కుటీర్ (పవర్) ప్రెస్

నరసాపురం

 1962 వెల రూ 1

# అంకితము

సర్వసమైక్య లసద్భావగరిమ చే
దిగ్విలసిత యశస్సిద్ధు డెవండు
పరహితార్థం బనవరతంబు శ్రమియించు
కలితసత్పుణ్యసంకల్పుఁ డెవఁడు
దానసద్ధర్మాది మానవనియమముల్
తప్పక పాటించు ధన్యు డెవడు
ఘనకపిలాన్వయ కలశాబ్ధి పూర్ణసు
ధాకర విఖ్యాతిఁ దనరు నెవఁడు
అట్టి ధీశాలి కామేశ్వరాహ్వయుండు
మజ్జనకుఁ డమ్మహాపుణ్యు మహితపాద
పద్మముల చెంత వ్రాలి సభక్తికముగ
అంకితం బిత్తు నికావ్య మధికభక్తి!



ఇట్లు
కపిల కృష్ణశర్మ
(కర్మశ్రీ)



# నా మనవి

ఏనాడో తెలుగునాడు శివభక్తిధురీణుడైన ప్రతాప రుద్రదేవ చక్రవర్తి పరిపాలిస్తూన్న కాలంలో ... కోట లోనే గాక ఊరూర, పల్లెపల్లెలా, వీధివీధులా, ... శివాలయాలు నెలకొల్పబడ్డాయి. తదాలయాధీశుడైన జగద్రక్షకుని పర్యవేక్షణలో సుభిక్షమై భారతత్మాతలి వర్ధిల్లుతూ వుండేది. ఆ సమయంలోనే ఈ నీలాద్రిదుర్గంకూడా వెలసింది. ఆ నాడు తులలేని వైభవాలతో, విలువైన వస్తువాహన సమృద్ధితో, పరిసరప్రాంతాలలో, సాటిలేని మేటి ప్రతిభావంతముగా, విరాజిల్లిన దీ నీలాద్రి. కాలక్రమేణా భక్త చక్రవర్తి పరిపాలన ముగిసింది.

అసలే నట్టడివిలో, చొరరాని గుట్టలపై నున్న, లింగమూర్తి దర్శనానికి ఒంటరిగా రాలేక, గుంపులుగా కలసి అప్పుడప్పుడు వచ్చి వెళ్లేవారు భక్తులు. సమర్థులైనవారు ఉపేక్షిస్తే, అసమర్థులు చూడలేక వాపోయేవారు. క్రమేపి భక్తులు పల్చబడ్డారు. అంతే ... ఎన్ని శతాబ్దాలు గడిచాయో! మళ్ళీ ఈనాడు అమ్మహనీయమూర్తిని గుర్తించారు ప్రజలు. ద్విగుణీకృతోత్సాహంతో పాల్గొని తిరణాలు జయప్రదం చేస్తున్నారు. ఆనాటి వైభవాన్ని ... కాదు... మించిన భోగాన్ని పొందుతుందని నామన స్సేలకో తలపిస్తూ వుంది. ఆ నీలాద్రీశ్వరుణ్ణి సందర్శించటం పరవశించటం... భక్త్యావేశంతో ఈ స్తవరూపకావ్యాన్ని రచించటం జరిగాయి. సహజంగా భాషాజ్ఞానవిహీనుడనైన నేను దోషభూ

యిష్టసమాసములతో - అప్రసిద్ధపదప్రయోగాలతో ... కావ్యనామానికే కళంక మాపాదించే రచనచేసి ఉత్కృష్ట కావ్యసృష్టి చేసినట్లు ఆనందించేవాడిని. "కవిభూషణ, కవిశేఖర శ్రీ శిష్టా వేంకటసుబ్బయ్య కవీంద్రు"ల సన్నిధికేగి సంస్కరింపచేసుకోవలసిందిగా పితృదేవులు ఆదేశించారు. ఆ మహాకవి చెంతకు ఈ తప్పులతడికను తీసుకువెళ్ళడానికి సిగ్గుపడ్డాను. కానీ వారు నాకావ్యాన్ని చూచి చిరునవ్వుతో ... "పుట్టగానే అనుభవజ్ఞులు కారుగా" అని సంస్కరింపటానికి పూనుకొని అచిరకాలంలో పూర్తిచేసి యిచ్చారు. అట్టి ఉదారస్వభావులగు కవిచంద్రులకు ప్రత్యుపకృతి యేమిసేయగలను. వారి దివ్యపాదాంభోజసన్నిధిని మోకరిల్లుటయే తప్ప!

నా అభివృద్ధి ఆకాంక్షించి ఫలితానికి ఆనందపరవశులయ్యే పూజ్యులకు - ఆత్మీయ బంధులకూ సర్వదా కృతజ్ఞుడను.

అర్థించగానే ఆదరాభిమానాలతో అభిప్రాయాల్ని అందచేసి ఆనందపరవశుణ్ణిగా చేసిన అభివందనీయులగు మహాకవులకు నమస్సులు......

సమయానికి నేను లేకపోయినా, తనపనిగా భావించి సాయపడిన విశాలహృదయుడు చి॥ కపిల కామేశ్వరరావుకు శుభాశీస్సులు.

ఇట్లు

రచయిత కర్మశ్రీ

# అభిప్రాయములు

శ్రీ కపిల కామేశ్వరసూర్యనారాయణగారు నాకు చిరకాలప్రియమిత్రులు. తొలుతనుండి వారికి వాఙ్మయాభిలాష మెండు. దానికితోడు గసజ్ఞులు.

చిరంజీవి కర్మశ్రీ వారి మూడవకుమార్తె. వీరు శ్రీ వెంకటేశనక్షత్రమాల యను గ్రంథపుత్రికను తొలుత రచించిరి. నీలాచలేశ్వరస్తవము నొకదానిని వ్రాసి సరిచూడుడని నాకిచ్చిరి. గ్రంథ మామూలచూడము చూచితిని. సంస్కృతాంధ్రములందు పాండితిని సంపాదింపకయే వీరు కవిత్వము వ్రాయ మొదలుపెట్టిరని వీరి రచన చూచినవారికి తోపక మానదు. మరి కవిత్వ మేల వ్రాయవలెనందురా? కవిత్వము గానము, చిత్రలేఖనము, ఈవిద్యలు అభ్యాసవశమున వచ్చునవి కావు. పూర్వవాసన - పూర్వజన్మసంస్కార మున్ననే గాని లేశము నలవడదు. "విద్యాశ్చతస్రోఽసాధ్యా స్స్యుర్జన్మనా! సహసంభవాః గాంధర్వంచ కవిత్వంచ" అనునానుడి యయదార్థము కాజాలదు. పరంజ్యోతి ప్రబోధమువలన వీరి కవితాస్రవంతి జాలువారినట్లు తోచుచున్నది. వ్యాకరణాది దోషము లున్నను - ఉండుట సహజము కూడ - మధురఫలమునకే పుచ్చు - కవిత్వము ధారాశుద్ధిగల్గి అనర్గళప్రవాహమువోలె నొప్పారుచున్నది.

పట్టుమని పదునెన్మిదేండ్లైన నిండని బాలుడిట్టి కవితాస్రవంతిని ప్రవహింపజేసినా డనిన మెచ్చుకొనదగిన విషయమే. అందందలి భావములు హృదయంగమములు. భగవ

త్ప్రేరితములుకనుకనే వేదాంతవైరాగ్యవిషయములను బోలు డయ్యును చక్కగా ప్రకటింపగలిగినాడు. ఇంచుక వ్యాకర ణాది విషయములను కూడ కూలంకషముగా గ్రహించినచో కవిత్వము బంగారమునకు సువాసన అబ్బినట్లు రాణించగలదు.

పిమ్మటి గ్రంథము "కృష్ణశతకము"

ఇందలి కవితాధోరణులు అనర్గళధారావారములై యున్నవి. ప్రౌఢతరములు - వీరు ఇతోధిక గ్రంథములు రచించి ఆంధ్రభాషాయోష కంఠసీమ నలంకరించి యెక్కుడుగా భాషాసేవ చేయుటకా పరాత్పరుడు చిరాయురారోగ్యసంపద లిచ్చి రక్షించుగాక. అని కోరుచూ మున్ముందింకనూ వృద్ధిలోనికి వచ్చి తెలుగుతోటలో వాడని - తావివీడని నెత్తావివిరియై - వికసించుగాక యని ఆశీర్వదించుచున్నాను.

ఇట్లు

నరసాపురం }
12-5-1961. }

కవిశేఖర, కవితావతంస, కవిభూషణ
శ్రీ శిష్టా వెంకటసుబ్బయ్య.

శ్రీ మాత్రే నమః

చిరంజీవి "కర్మశ్రీ" నాకు ప్రియశిష్యుడు, చిరుతవయస్కుడు, ఆవేశహృదయుడు.

కవిత్వం, సంగీతం, చిత్రలేఖనం, నాట్యం, శిల్పం, మొదలగు లలితకళలు పూర్వజన్మ సంచితముచే లభింపవలయునే గానీ యభ్యాసవశమున వచ్చునవి కావు. భక్తియు నట్టిదే! ఈ కృష్ణశర్మ పూర్వపుణ్యావిశేషము విశేషమైనది. కావుననే ఇంత చిన్నవయసులోనే, కవిత్వమునందును, భక్తి

యుండును, నాసక్తి యబ్బినది. సంస్కృతాంధ్రములందు పాండిత్య మంతగా లేకున్నను, అనర్గళధారాశుద్ధితో, బద్యములు చెప్పగల్గిన ఆవేశ మలవడినది. కవిత్వమునకు భక్తి - పువ్వునకు తావివంటిది.

భక్తవశంకరుడగు శంకరుని లీలావినోదములను గీర్తించు "శ్రీ నీలాచలేశ్వరస్తవము" జదువునప్పుడు నాకు తన్మయత్వము కల్గినది. ఝరీప్రవాహతుల్యమైన ధార నన్ను ముగ్ధుణ్ణి చేసినది. పాండిత్యవిశేష మంతగా లేకున్న కారణమున శబ్దదోషములు, వ్యాకరణదోషములు, అక్కడక్కడ నుండవచ్చును. భక్తిప్రధానముగను భావప్రధానముగను - చూచునప్పు డిట్టివి మఱుగుపడిపోవును. ఆవేశపూరితాధునిక కవిత్వమం దిట్టివి గమనార్హములు కావు. అమోఘ కవితాధురంధరుడు కాగలడనుట కిదియే నాంది. ఈ బాలకవివసంతనీలకంఠగళమున, నీలకంఠేశ్వరుని కీర్తించినాడు. దానిని పఠించి తరించు మార్గమును కల్పించినాడు. ఈ ఆవేశముతోడనే "శ్రీ వేంకటేశ నక్షత్రమాల" "కృష్ణ శతకం" మున్నుగాగల కావ్యంబులను రచించి ఆంధ్రకవితామ తల్లిని అలంకరించి అలరించి జన్మ సార్థకతను గావించుకొనుచున్నాడు. ఈ చిరంజీవికి ఉజ్జ్వలభావి సూచింపబచున్నది. కావున శ్రీ పరమేశ్వరి దీర్ఘాయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించి కవితా వ్యాసంగమును ఇతోధిక ప్రజ్ఞావంతము చేయుచూ సదా ఈ బాలకవిని రక్షించుగాక!

పాలకొల్లు,
15-5-1961

కవిభూషణ
ఆంద్ర శేషగిరిరావు.

శివాయ నమః

'శ్రీనీలాచలేశ్వరస్తవము' అను పేర వెలయు నీ శతకరాజంబును స్థాలీపులాకన్యాయంబునఁ జూచుట సంభవించినది. రచయిత ముక్కుపచ్చలారని ముద్దుబాలకుఁడు. బాల్యమునందె యీతనికిఁ గవితాప్రాదుర్భావము సంప్రాప్తించుట ప్రాక్తనపుణ్యపరిపాకంబు మాత్రమే. శాస్త్రములు చదువుట లేకయే, గురువుల శుశ్రూష లేకయే యీతని జిహ్వాగ్రంబున భారతీదేవి చిందులుద్రొక్కుట కారంభించినది. ముందుముం దీ బాలకవిచే ఎన్ని కృతిసుమంబులు వెలయింపఁజేసి తానలంకరించికొనునో ఆ దేవదేవియే ఎఱుంగఁగలదు. పద్యంబుల యందచ్చటచ్చట వ్యాకృతిదోషంబులున్నను మామిడిపండు దినువారలకు అందలి తేసె లాటంకమును గలిగింపఁజాలనిరీతి భక్తిరసాస్వాదనంబునొనరించు పాఠకుల కా యల్పదోషంబులు గణుతికి రానేరవు. ఇంకనూ కొంతవఱకీ చిరంజీవి తగు నొజ్జలవద్ద విద్యావైశద్య మార్జించి యెన్నికఁగన్న కవివతంసుఁడై యాంధ్రభాషాయోషఁ బెక్కువిధంబుల సేవించి కృతార్థుఁడై తాను యశఃపాత్రంబగుటయే కాక, వంశమును గూడఁ జరితార్థముగావింపఁగలఁడను నాశయముతో నీచిరంజీవి కర్మశ్రీని చిరంజీవిగా నాశీర్వదించుచూ, విద్యావినయవిభూతిసంపన్నుఁడై యలరారునటు లా నీలాచలేశ్వరుఁ డనుగ్రహించుగాత, యని కోరుచున్నాను. ఇతి శివమ్.

పాలకొల్లు<br>13-5-1961

ఆత్రేయ విద్వన్మహాకవి పండిత<br>శ్రీ పామర్తి సూర్యప్రకాశ శర్మ

# పీఠిక

## శ్రీ కృష్ణ స్తుతి

శ్రీకర! దేవకీతనయ!
శ్రీలలనాహృదయాబ్జభృంగ! మా
యా కలిత ప్రభావ విభ
వాంచితరూపవిశేష! గోపికా
నీక విలోల మానస! ము
ని ప్రవరాత్మ సదావిహార! లో
కైక శరణ్య! భక్తజన
బృందనిధాన! హరీ! నమోనమః॥

ఉ. బాలుని సర్వలోకపరి
పాలుని ధిక్కృతపూర్వదేవతా
జాలుని, దేవతానిచయ
సారసకేళివిలోలునిన్ జగ
జ్జాలుని శౌరి బాంధవ వి
శాలునిఁ గాంచనరూపచేలునిన్
లాలిత మందహాస సు
విలాసునిఁ గృష్ణునిఁ గొల్తు నిచ్చలున్

## సరస్వతీ ప్రార్థన

ఉ. వాణికి వేదశాస్త్రచయ
పాణికిఁ బద్మజురాణికిన్ గుణా

శ్రేణికి నీలనీరదరు
చిస్థిరవేణికి దృగ్జితైణికిన్
ఆణిమెఱుంగు ముత్తియపు
హారములూను పురాణికిన్ లసత్
శ్రోణికిఁ బద్మపాణికి వి
శుద్ధశరీరిణి కేను మ్రొక్కెదన్

విఘ్నేశ్వర స్తుతి

ఉ. వేనిసమాహ్వయంబు దెలి
పిన్ దొలిపూజ జయంబు గూర్చునో
వేని పదాబ్జవజ్రిహాతి
విఘ్నమహీంద్రము లెల్లఁ గూల్చునో
వేనికి గరికపోచ యిడఁ
బెల్లు శుభమ్ములు నివ్వటిల్లునో
వానికి విఘ్ననాథునకు
వారక మ్రొక్కుదు నిష్టసిద్ధికిన్

గురు దేవ స్తుతి

ఉ. అక్కరమైన రాని తరి
నాదరమొప్పగఁ జేరఁదీసి నా
కి కవితావిధానముల
నెంతయుఁ బ్రీతిని బోధచేసి స
మ్యక్కరుణామతిన్ పృథివి
యందున నొక్క మనీషికైవడిన్

చక్కఁగ సాకినట్టి గురు
చంద్రుని వెంకటరాయు గొల్చెదన్.

సుకవిసంస్తుతి

తే. గీ. నన్నపార్యు వాక్ప్రౌఢిమ సన్నుతించి
తిక్కనార్యు వాగ్వైభవ స్థితి నుతించి
శంభుదాసుని ధీశక్తి సంస్తుతించి
పోతనామాత్యు నాత్మలో బొగడి పొగడి
భాస్కరామాత్యుఁ గంకంటి పాపరాజు
గోపినాధ వేంకటకవిన్ గొలిచి యవల
నాధునిక కవిశ్రేష్ఠుల నభినుతించి
వేడుకొందును సుముఖులై వినుటకొరకు

వ. ఇట్టు లిష్టదేవతాప్రార్థనంబును గురుస్తుతియు సుకవి సంస్తుతియుఁ గావించి మదీయవంశానుక్రమంబు దెలి పెద.

సీ. సర్వశాస్త్రపురాణసాహిత్యసంవేదియై
మై పండితఖ్యాతి నలరు నెవఁడు
ఆంధ్రాంగ్లభాషా రసాస్వాదనాసక్తి
గల కోవిదుఁ డగుచు నలరు నెవఁడు
ప్రధిక సూనృతవాక్యపాలనా పటిమయే
విజయభేరిగఁ జేసి వెలయు నెవఁడు
తన శక్తికిని మించి దానధర్మాదుల
నాచరించుచుఁ గీర్తి నలరు నెవఁడు

కాశ్యపసగోత్రమందు ముఖ్యత్వమంది
కపిల వంశాంబుధీ క్షుపాకరుఁ డెవండు
అట్టి కామేశ్వరాహ్వయు నమలచరితు
మజ్జనకుఁ బ్రస్తుతింతు సమ్మోద మెలర్ప.

చ అనయము భర్తృసేవయు ని
రంతర దైవత సేవయున్ జిరం
తనమగు సంప్రదాయక వి
తానములం దనురక్తియుం బెనం
గొన వెలుగొంది స్వర్భ్యపుని
గొన్న పతివ్రత యన్నపూర్ణ మ
జ్జనని తదీయ పాదజల
జమ్ములఁ జేతులు మోడ్చి మ్రొక్కెదన్

ఉ. ఆదరమొప్ప వక్షమున
హత్తియు మిక్కిలి ప్రేమతోడ న
న్నేదిరియొ దొక్క భక్తిరస
మేర్పడు కావ్యము వ్రాయఁ జేయుత
త్సోదర దైవభక్తిని ర
తున్ విమలాత్ముని బుణ్యమూర్తినిన్
వేదప్రధాశ్రితున్ గొలుచు
వేమఋ భాస్కర నామధేయునిన్.

తే.గీ. అరయ దేవీత్రియుం బొకపరి వసుధను
నేకరూపంబునన్ జరియింప నిచ్చఁ

జేసి యవతరించె ననఁగఁ జెల్లు వదినఁ
గొలుతు వెంకటరమణాంబ లలిత మతిని

తే.గీ. అన్నలిర్వురు రామరాయాఖ్యఁ దొకఁడు
విజయలక్ష్మణరావన విమలమతులు
అనుజు లిర్వురు సూర్యరావనఁగ మరియు
లక్ష్మినరసింహారావన లలిత గుణులు
విజయలక్ష్మి యనంగనుఁ బెద్దవదిన
నిర్మల సమాఖ్యఁ దనరు చిన్నివదినయును
పుత్రులందున మధ్యమ పుత్రుఁ డేను
భక్తుఁడను కృష్ణశర్మాఖ్యఁ బరగువాఁడ.

వ. తదనంతరంబ శ్రీ నీలాచలేశ్వరస్వావతరణ కథావిధానం బెఱింగించెద. సావధానచిత్తులై యాకర్ణింపుడు. జనబాహుళ్యంబున విశేష పరిచారవిహీనంబగుటం జేసి, సవిస్తరంబుగాఁ బ్రస్తావించెద.

నీలనామధేయంబున విరాజిల్లు నగంబు యోజనాన్విత ప్రలంబు, వైశాల్యయుతంబయిఁ దేజరిల్లుచూ కీకారణ్య సంకీర్ణంబై ...

కదంబ, కాదంబ, క్రికచపత్రి, కాంచన, హింతాల, తమాల, తక్కోల, రసాల, సాల, చందన, పిచుమంద, పలాశ, శింశు, శిరీష, ఫలాధ్యక్ష, ప్లక్ష, ఫల్గువ, ప్లవ, బంగాళ, బంధుజీవ, బందెడ, బకాను, ధూళికదంబ, బదర,

బదరీ, సింధువార, బంధుసడ్డ, బలుస, అర్జున, భిల్లుకు, వేగుమ్మ, గుమ్మ, సాదన, ములస, తునికి, బుర్రజీమ, బర్రి దుద్దు, బర్రెంక, పెన్నంగి, తెల్లుమ్మ, నల్లుమ్మ, చంద్ర, వెలిచంద్ర, చిందుగు దురిసెన, కొడిసె, జిట్రేగి, ఏగిస, పెద్దే గిస, రేల, వేప, వేపి, గుంపెన, సిరిమాను, చెన్నంగి, బూరుగు, తవిస, గొట్టి, ముష్టి, వెలగ, తొర్రెలగ, గెన్న, విప్ప, కుంకుడి, చింత, సీమచింత, పెదమాను, ఇత్యాది మహామహీరుహ నిబిడంబును...

ఖడ్గ, శరభ, శార్దూల, భల్లూక, భూదార, శశ, హరిణ, మర్కట, మహిష, జంబూక, సాలావృక, ఏగోల, కోండ్రాస, యెనుబోతు, మనుబోతు, మొదలగు జంతునివా సంబును...

చిలుక, గోరింప, పావుర, మయూర, గువ్వ, గ్రద్ద, డేగ, రాబంధు, దివాంధ, పూరేడు, కౌజ, కోకిల, గండభే రుండ, కుక్కుట, చక్రవాక, బక, వాయస...

త్రాచు, పింజర, రక్తపింజర, కొండచిలువ, చెట్టు డుకు, వాన, దారి, జర్రి, కట్ల, నూగట్ల, సూర్యముఖి, శిఖండి పంచముఖాది నిఖిల అండజ సంకులంబును...

రత్న, వజ్ర, వైడూర్య, గోమేధిక, పుష్పరాగాది మణి, ధన, నిధి, నిక్షేపంబునూ...

యక్ష, గరుడ, కిన్నర, కింపురుష, నాగ, నభశ్చర, విద్యాధరాది, త్రిదశవాహినీ, విహారార్హంబునై, వెలుఁగొందు నయ్యచలశిఖర ఏకశిలాప్రాగ్భారంబున, చతురస్తంభసంభృత ప్రాకారంబును, నందొక నందీశ్వరుండును, ముందొక ధ్వజస్తంభంబును లోన శ్రీ పరమేశ్వరాత్మలింగంబునూ, ఆవల దక్షిణహస్త భాగంబున దేవాలయంబు నానియొక మహోరగవల్మీకంబును దాపల చతుర్గజంబు నానొప్పునొక్క శిలయు, తన్మధ్యంబున నొక రంధ్రింబును, దాననుండి ద్వాదశఘటంబుల నీరం బెల్లవేళలఁ బ్రాదుర్భావంబుఁ జెందుటయు నాదిగా నగు ననేక విశేషంబు లచ్చోటఁ గన్పించు నేనునూ యన్నగ ప్రభావంబు ననేకరీతుల నాలించి, మహావైభవంబునం జరుగు శివరాత్ర్యుత్సవ సందర్శన కుతూహలాతిరేకంబునం జని...

తద్దివ్యవైభవ ప్రభావ తేజోమూర్తిం గని భక్తి సంభ్రమములు పెల్లుబకఁ దటాలునఁ గరంబులు ముకుళించి ఇట్లు నుతించితి—

దండకము

శ్రీదేవదేవా మహాదేవ శంభో జటాజూట ధారీ పురధ్వంసకా, అర్ధనారీశ్వరా సత్కృపాంభోనిధీ యోగమాయామయా నీప్రభావంబు బ్రహ్మాది దివ్యత్తపోధుర్యులే ఎంచలేరన్న నేనెంతవాడన్ రజస్సత్వ యేతత్తమోజాలబద్ధుండ

కామాంధుడన్ జంతుతుల్యుండ విజ్ఞానశూన్యుండ పారంబె లేనట్టి సంసారపంకంబునం జిక్కి, కకూర్తి దుష్కర్మలం బెక్కు గావించి కుక్షింభరత్వంబు నన్గాలమున్ గెంటు దుర్మార్గుడన్ దేవ! కూపస్థమండూక సామ్యంబునన్ మూర్ఖతన్ గూడి మాయావిలోలుండనై యుండి లోకాధినాథుండవున్ బ్రాణిసంరక్షణాభారదక్షుండవే నిన్ను వర్ణింపలేనట్టి యజ్ఞుండ యోగాదిమార్గంబునన్ సిద్ధులున్ మించి విజ్ఞానసంపత్తితో జ్ఞానులున్ ఐక్యభావంబునన్ మానివర్యుల్ సునిష్ఠాగరిష్ఠాత్మతన్ యోగు లధ్యాత్మ చింతారతిన్ భక్తియాథంబు దివ్యానుభూతిన్ యతీంద్రుల్ సమాధిన్ విధాత్రాది తేజోదురంధుర్యులున్ నిన్ను సేవించి దుస్సాధ్యమైనట్టి మోక్ష సామ్రాజ్యలక్ష్మి పదప్రాప్తులై దేజరిల్లన్మహాదేవ! యీరేడులోకంబులం దీవ నీయందు లోకంబులున్ లీనమై సృష్టి నిర్మాణ నిర్వాహకత్వంబు పెంపొందగా లీల జన్మంబులన్ దాల్చుచున్ బోల్చ నిష్కర్మ నిష్కామ్య తత్వంబులన్ వెల్గి దుష్టాత్ముల న్నొంప శిష్టాత్ములన్ గావ పాపవ్రజాపూర్ణమైయుండు సంసారపాథోనిధిం బోల్చి అంభోజపత్రంబు చందంబునన్ మధ్య నింపొంది దూరుండవై యుండు ఈశా! కృపావేశ! లోకేశ! గౌరీమనోవాస! మాయాపరివ్యాప్తదుర్గంధభూయిష్టమా జన్మలున్ లేక సంపూర్ణసౌఖ్యాల వాలంబగా నా భవత్సన్నిధానంబు జేరంగ కారుణ్యబుద్ధిం బ్రసాదింపవే త్రుంపవే, పాపపాశంబులన్ దేవ! కారుణ్యసిక్తోరు

హృత్పంకజా! సంతతాస్తోకసంసారదుర్దాంత నిర్బంధనా
భూరిపాశాలవిత్రా! లలాటాగ్నినేత్రా! మహాదేవ హృత్పద్మ
సంస్తవ్యపాత్రా! పవిత్రా! మహాదేవదేవా! యుమానాథ
బాలేందుభూషా! నమస్తే నమస్తే నమః ॥

వ. అని పెక్కుభంగుల నుతించి యారేయి నచ్చోట
నత్యంతానంద తన్మయత్వంబునం గడపి మరునాఁడు వేఁకువ
జామున లేచి యప్పార్వతీశ్వరు దర్శనంబు గావించుకొని,
సత్వరంబ గృహంబుఁ జేరి మనంబున నీశ్వరసన్నిధానంబుఁ
గల్పించుకొని, ఈ స్తవరూపకావ్యంబు రచింపఁదొడంగొంటి

తే.గీ. విద్య నొక్కింత నేర్వని పిన్నవాఁడ
రసమయకవిత్వదూరుఁడ ప్రజ్ఞసున్న
తనయు మాట కానందించు తండ్రిఁ బోలెఁ
గోవిదులు నా పలుకు వినఁ గోరువాఁడ.

తే. దోసఁగు లెల్లైనఁ దప్పక పోసఁగు నిందు
విబుధవర్యులు దయతోడ విడచి పుచ్చి
గుణముగల్గిన గ్రహియింపఁ గోరువాఁడ
నైదు పదియునై నిటలంబు నాక్రమింప.

# శ్రీ నీలాచలేశ్వర స్తవము

శ్రీ శ్రీనమశ్శివాయా!
సుశ్రీ విహారణవిలసిత సుక్షేత్రస్థా!
హే! శ్రీధరసంచయ భూ
షా! శ్రీకైలాసవాస! సద్గురు శంభో!

కం. శ్రీగౌరీమానసచో
రా! గంగాధర! విలసితరాకేందుశిఖా!
సాగరనిభగంభీరా!
వేగ గరళకంఠ! కరుణ-వీక్షింపు హరా!

శా. శ్రీకైలాసనివాస!
నిత్యకరుణాసిక్తోరు సద్వీక్షణా!
లోకాలోకయశస్సమూహనిబిడా!
లోకాధినాథా ! నుత
శ్రీకారుణ్యరసాకరా! శశిధరా!
శ్రీనీలదుర్గేశ, లిం
గాకారా! కృప నేలుకొమ్ము
నిజభక్తానీక సంరక్షకా!

చం. గరళము కంధరమ్మున నఖండ
భయానక వహ్నిదీప్తి వి

స్ఫురిత లలాటసీమను
వపుస్సు సగంబునఁ బార్వతీ సతిన్
శిరమున జాహ్నవీ రుచిరశీలను
లీలగఁ గొప్పులో సుధా
కరుని ముదానఁ దాల్చియు
జగమ్ముల నేలుదు నీలకంధరా!

ఉ. చంచలమైన దేహ మిల శాశ్వత
మంచును మూఢు లౌచు దా
రెంచి సతీసుతాదులు నహీన
ధనంబులు నిక్కమంచు భా
వించి మహోగ్రకర్మములు పేరిమి
సల్పెదు రీ జనాళి ని
న్నెంచక దేవ సత్కరుణ
నేలుము నీలగిరీశ్వరా! హరా!

ఉ. వీరుని ఫల్గుణుం గదసి భిల్లుని
యేపగు రూపు దాల్చి భూ
దారనిభంబుతో నతని ధైర్య
సమన్విత శౌర్యధుర్యతో
దారత చూచి మెచ్చి కృప
దాలిచి పాశుపతాస్త్రహస్తునిన్
ధీరత చేయవే మునుపు ధీర
మతప్రతిభాఢ్య! యీశ్వరా!

సీ. కాలకూటవిషమ్ము కంఠంబున ధరించి
సురకోటి కెవ్వాఁడు సుధ యొసంగె
కరిచర్మమును తాను ధరియించి యెవ్వాఁడు
భక్తులకు జిలుగు వలువ లొసఁగె
భూతినిఁ దాఁ బూసి భూరి విభూతుని
భక్తుల కెవ్వఁ డాసక్తి నిచ్చె
కూరసర్పంబులఁ గోరి ధరించి యె
వ్వాఁడు ప్రజలకు సువర్ణ వర్ణ
తే. వజ్రఖచితహారములఁ గృపన్ ఘటించె
నట్టి దేవదేవుని జగద్వ్యాప్తు గరళ
కంఠునిం గల్మషకుఠారు ఖలవిదారు
నీలగిరివాసుఁ గొల్చెద నిర్మలాత్మ.

ఉ. నీ కరుణాప్తడింప నవ
నీస్థలి శక్తుఁ డెవ్వఁ డెఱుంగమే
భీకరలోకకంటకుఁడు
వృత్రవిరోధి గజాసురు న్సదా
లోకము సన్నుతింప నని
లోఁ దునిమాడి తదీయు వాంఛ నీ
వా కరిచర్మ మూనవెఁ
దయారససాగర! నీలకంధరా!

ఉ. మానవమాత్రుఁ డంచు నిను
మానసమందుఁ దలంచి క్రొవ్వి వి

జ్ఞానివిదూరుఁ డమ్మరుఁడు
సాహసగర్వసమంచితుండు బల్
సూనశరంబు నేసి మన
సుం గలపంగను గన్నువిప్పి యు
గ్రానల దీప్తిమై నతని
యాకృతిఁ గాల్చవె చంద్రశేఖరా!

మ. సురలెల్లన్ మఱుఁ జీరి శంభుఁడు తప
స్సుం బూని లోకమ్ములన్
పరిపాలించుటమాని యుండెఁ గద కం
దర్పా! శివుం దేర్చియున్
గరుణన్ లోకముఁ గావుమం చనిన ని
న్గాల్చె నాతండు త
ప్పరయన్ వానిదియౌనె పుణ్యమునకో
నా! పాపమో యీశ్వరా!

కం. కోపము హెచ్చుగవచ్చిన
నోపికతోడ న్వెనుకకు నొక మూడడుగుల్
శ్రీపద! వేసినచోఁ ద
త్కోపాగ్ని శమించుఁ గాదె తోడనె దేవా!

సీ. దేవదేవా! శివా! కావరా యన్న మా
ర్కండేయునిఁ గరుణఁ గావలేదా
కాలకూటమ్మును కంఠమ్మునందుంచి
యనుకంప జగముల నరయలేదా

భక్తిమైఁ బార్థుండు ప్రార్థింప సత్కృప
నిచ్చి పాశుపతము మెచ్చ లేదొ
నినుగూర్చి తనుజులు ఘనతపం బొనరింప
నింపి వరముల రక్షింపలేదొ

తే. అన్యదైవంబుల సురుల కన్యులగుదు
రంతె నీకట్టి భేదంబు నుంత లేదు
అందఱియెడ నొకేరీతి నుందు వీవు
నీలగిరిశర్వ! భేదంబు నీకుఁ గలదె?

శా. శ్రీకంఠా! ఘనభక్తలోకవరదా!
సిద్ధానుకంపానిధీ!
శ్రీకైలాసనగాధినాథ! నుతకా
శీక్షేత్రలీలావిహా
రా! కారుణ్యగుణాధికా! అభవ! హే!
రాకేందుసద్భూషణా!
నీకు మ్రొక్కెదఁ గావుమయ్య! కరుణా
నీలాద్రివాసా! హరా!

సీ. వేదముల్ వల్లించి విజ్ఞానముఁ గడింప
జాలదు నాకున్న జ్ఞానలవము
శాస్త్రముల్ పఠియించి జ్ఞానమార్జింపగా
సరిపోదు జీవితసమయమెల్ల
ఉద్గ్రంథములలోని యున్నతి తెలియఁగఁ
దెలివిలేశమ్మైనఁ గలుగఁబోదు

బుధవర్యులను జేరి బుద్ధులు నేర్వంగఁ
బిన్నతనం బది వీడలేదు

తే. పలుకు పలుకున నమృతంబు చిలుకునట్టి
సత్కవిత్వము పేరింటి సరసపుష్ప
సంచయమ్ములఁ బూజించు శక్తి లేదు
చేయిమోడ్చుట తప్ప కాత్యాయనీశ!

ఉ. బాలుఁడఁ జూడఁగాఁ దెలుఁగు
బాసయుఁ బూర్తిగ రాదయెట్లు శా
స్త్రాలను నేర్తు నేగతిని
జ్ఞానము సూనుదు నాత్మశక్తిమై
నీలగిరీశ! నీ ప్రతిభ
నే ధరఁ జాటెద నీవఁ గల్గు లో
పాలు గణింపఁబోక నను
పాలనఁ జేయుము పార్వతీపతీ!

ఉ. పాటితలంపఁ బోక ప్రతి
భాగతిభాసురమైన యీజగ
న్నాటకమందు పాత్రనయి
నాఁడను వేసరినాఁడ నింక నీ
నాటక పాత్రధారణకు
నాకగుపింపవు యోగ్యతల్ ననున్
నీటుగఁ బ్రోవుమయ్య! హర
నీలగిరీశ్వర! చంద్రశేఖరా!

సీ. చల్లనికాంతుల జగములవెదజల్లు
నెలవంక యొకవంక వెలుగుచుండ
సర్వకలుషహారి! సర్వలోకవిహారి!
శిరమున జాహ్నవి చేరియుండ
నాగంబు లింపారు నగలయి మేనిపై
స్వేచ్ఛావిహారంబు చేయుచుండ
పరమ పాతివ్రత్యభావంబు గల గౌరి
యర్ధదేహంబున నమరియుండ

తే. దంతి ముఖషణ్ముఖాది సంతాన మొప్ప
నందికేశ్వరుఁ డెదుట నానందమొంద
నెసఁగుచుండిన నీలగిరీశ్వరుండ!
భక్తిఁ బ్రొక్కెద నన్ను గాపాడుమయ్య!

సీ. లోకమెల్లరకు ననేకశుభము లిత్తు
వందుచే నీకు శివాఖ్య గలిగె
దైవంబులకుఁ గూడ దైవంబవగుటచే
మహి "మహాదేవ" నామంబు వచ్చె
సంధ్యాసమయమునఁ జలుపు తాండవముచే
నటరాజు పేరు వినాణ మొదవె
పరమభక్తుల పాపపటలమ్ము లవలీల
హరియించుదువు గాన హరుఁడవైతి

తే. ప్రభవమెఱుఁగరాని నిల నభవుఁడవైతి
జటలభారంబు కతన ధూర్జటివమైతి

భక్తులకు సుఖ మొసఁగెడు వాఁడవగుట
శంకరుఁడవైతి నీలాద్రి శంకరుండ.

ఉ. పారములేక కష్టముల
పాల్పడి యుక్కిరిబిక్కిరౌచు, సం
సారపయోధి నీదఁగ న
శక్తుఁడనయ్యు, మఱొండు మార్గమున్
నేరక నీపదాబ్జముల
నెమ్మదిఁ గొల్చుచు భక్తియుక్తమై
ధీరత ముక్తిగాంతు భవ
దీయ పదార్చనఁ బార్వతీపతీ!

సీ. సుఖదుఃఖములను పంచుకొని సమమ్ముగాఁ
బాయక సేవించు భార్య భార్య
తల్లిదండ్రులె మహాదైవతమ్ము లటంచు
సతముఁ బూజించెడి సుతుఁడు సుతుడు
ఆధ్యాత్మికపువిద్య నభ్యసింపఁగ జేసి
సిరిదిద్దఁ జాలిన గురుడు గురుఁడు
మంచిచెడ్డల విస్తరించి ప్రబోధించి
హితముచెప్పగనేర్చు హితుఁడు హితుఁడు

తే. భక్తు లడిగిన తోడనే వరము లిచ్చి
కల్పతరువౌచు తనరారు వేల్పు వేల్పు
పురజనమ్మును గాపాడు హరుఁడు హరుడు
నిన్ను గనువాఁడె మనువాఁడు నీలకంఠ!

చ. హరహర! శంభో! శంకర ద
యారససాగర! చంద్రశేఖరా!
వరమునిమానసభ్రమర!
భవ్యజటాభర! శైలజామనో
హర! నిగమార్థరూప! భుజ
గాభరణా! లయకారణా! మహే
శ్వర! వరనీలపర్వతని
వాస! నుతించెద నిన్ను త్ర్యంబకా!

సీ. అడుగకమున్నె తా నన్యుల కష్టముల్
తెలసి తొలంచువాఁడు దేవసముఁడు
అడిగినచోఁ దన యంచితశక్తిని
దాన మొసఁగువాఁడు త్యాగియగును
అడిగినచో గుప్పెడైనఁ బెట్టని యతం
డసురాధమునికన్న నధముఁ డగును
యాచకులం జూచి యాగ్రహించియుఁ గఠి
నంబుగా శిక్షించు నరుఁ డెవండొ

తే. నిర్ణయింపగాఁ దరమానె నీకుఁ గాని
పద్మనాభునకుం గాని పద్మజునకుఁ
గాని వేనోళ్ళ చిలువకుఁ గాని దేవ!
నీలగిరిలోల! కరుణరసాలవాల!

ఉ. శ్రీగిరిజాకుచాద్రితల
జృంభితగంధఘుమంఘుమమ్ము హే

లాగతిఁ బిక్కటిల్లఁ గడు
లాలనఁ జెక్కిలి ముద్దు వెట్టఁ బో
గా గిరిశుండు మార్గ్గము
గల్గఁగ నీశ్వరి బుజ్జగించు నో
భోగి విభూషణుండ! నను
బ్రోవుము సత్కృప నీలకంధరా!

సీ. సిరులనర్థింతునా కరటిచర్మంబును
బూదియే నీకుఁ బైపూఁతలయ్యె
కడుపునిండుగ నింత కబళ మాసింతునా
హాలాహలంబె యాహారమయ్యె
మడిమాన్యములు నిన్ను నడుగుదమా యన్న
నాదిభిక్షుండవై యలరుదయ్య
ఇంకేమి యర్థింప నీవిచ్చెదో నీల
కంఠ! యెఱుంగను గాని కరుణఁ

తే. జూడు మంతియే చాలు నో శుద్ధమూర్తి!
మరల మరల నీ కెప్డు నమస్కరింతు
భక్తమందార! ధీర! సుపర్వవంద్య!
నీలగిరిలోల! కరుణరసాలవాల!

మ. హరియంచున్ హరుఁడంచు బ్రహ్మయని భ
క్త్యావేశమొప్పారఁ గొ
ల్తు రమూలం బొకటే యటంచు మదిలో
లోనూహ గావింప రి

ద్ధర నిన్నెట్లు భజించినం దలంపగాఁ
దప్పేమి సద్భక్తియే
మరి ముఖ్యంబగుఁగాదె నీలగిరిధా
మా! శిష్టరక్షకర్మా!

ఉ. క్రూరుఁడు చోరుఁడున్ ఖలుఁ డ
కుంఠిత జారుఁడు నైనఁ గాని నో
రారఁగ హే! శివా! శివ శి
వా యని నిశ్చలబుద్ధితోడ ము
మ్మారు వచించెనేని హాత
మారును పాపసమూహమెల్ల నిం
పారఁగఁ బొందవచ్చుఁ గద
స్వర్గము మోక్షము నీలకంధరా!

మ. శివ! శంభో! హర! శంకరా! శశిధరా!
శ్రీకంఠ! విశ్వేశ్వరా!
భవ! గంగాధర! మేనకాత్మజపతీ!
భక్తార్తిసంహారకా!
రవితుల్యాభ! గిరీశ! కల్మషవిదూ
రా! హే మహాదేవ! నా
గవిభూషా! అభవా! లలాటనయనా!
కాపాడు నీలేశ్వరా!

ఉ. సత్యము పల్కుచున్ మిపుల
శాంతిపథమ్మున సంచరింపుచున్

నిత్య మహింసనే హృదిని
నిల్పుచు ధర్మము నూనుచుం జగ
త్సత్యమెఱింగి వేదముల
సార మెఱింగి మెలంగఁగావలెన్
సత్యగుణస్వరూప! పుర
సంహరణా! ఫణిభూషణా! ఘనా!

మ. వరముల్ గోరను నెత్తికెక్కి కులుకన్
వాంఛింప నయ్యోసుధా
కర భాగీరథులట్లు మేని సగమున్
గాంక్షింప దుర్గం బలెన్
కరి దైతేయుని భంగిఁ గోరను భవ
త్కారుణ్య మొక్కండె నిన్
హర నత్సత్కృపఁ బ్రోవఁ గోరెదను నీ
లాద్రీశ్వరా! శంకరా!

మ. అరయన్ ముప్పురు రాక్షసాగ్రణులు ధై
ర్యస్థైర్యసంపన్నులై
పురముల్ మూటినిఁ గట్టి నిర్భయమునన్
ముల్లోకముల్ నొంపగా
శరసంధానమొనర్చి యొక్కమొగి నా
శంబొందఁగాఁ జేసి సౌ
ఖ్యరమం గూర్చిన నిన్ను గొల్చెద హరా!
కాత్యాయనీసద్వరా!

మ. ఒక భార్యన్ భరియించుటే భరము నీ
వో పార్వతీగంగలన్
అకలంకాత్మతఁ దాల్చుచుంటివి జగ
ద్వ్యాపారముం బూని భ
క్తకదంబంబును బ్రోచుచుంటివి జగ
త్కల్యాణమే దీక్షగా
సకలేశా! యిక భక్తరేణువు ననున్
సాకంగదే యీశ్వరా!

ఉ. ఏపనినైనఁ జేయునపు
డేగతి నయ్యెది తిర్గి వచ్చునో
యాపని చేయనౌనో యని
యారసి యారసి చేయుడంచు మా
యీ పసివాండ్రకున్ విబుధు
లేర్పడఁ జెప్పెదు నీతి రీతి మే
మా పగిదిఁ జరింతుము సు
మా! నిను గొల్చుచుఁ బార్వతీపతీ!

కం. దాసుఁడ భక్తుల కెల్లను
దాసుఁడ నీకును మహేశ! ధర నెవ్వారే
నాసాసల శివ శివ యన
దోసంబులు తొలఁగి ముక్తిఁ దొరకుఁ బినాకీ!

సీ. కమనీయ రుచులీను కౌస్తుభమణితోడ
రహియించి వెలుఁగు సర్పములతోడ

మృగనాభిపంకంబు బుగబుగల్ మెయితోడ
నగ్నిఁ జిమ్మెడు లలాటాక్షితోడ
నిగనిగల్ వెదజల్లు నెమలిఫించముతోడ
పొలుపారు జాబిల్లి పువ్వుతోడ
గొప్పయై యొప్పు వైకుంఠవాసముతోడ
మహిత కైలాస ధామంబుతోడ

గీ. లలిత వక్షంబు వీడని లక్ష్మితోడ
సగము మేనను వెలుఁగొందు నగజతోడ
హరిహరాకారమున వెల్గు నాదిదేవ
నీలగిరివాస నినుగొల్తు నిపుణభక్తి.

కం. వక్కాణించెను దిక్కున
చిక్కగ భారతమునందు శివకేశవులం
దొక్కింతయు భేదంబు హు
ళక్కి యటంచును గరళగళా! త్రిపురారీ!

ఉ. శంకరుఁ డుబ్బులింగఁడను
శాస్త్రము చూడ యదార్థమయ్యె నీ
వంకరబుద్ధి మార్చుకొని
భక్తుల కోర్కెల నెంచి వాంఛలన్
వంకలు చూచుకొమ్మ మును
భస్మనిశాచరుబుద్ధి చూడవే
శంకర భక్తసంతతిన
శంకర నీలగిరీశ్వరా! హరా!

ఉ. జ్ఞాన మొకింతలేక స్మర
సంహరుఁ గొల్వక కొద్దివేల్పులన్
మానుగఁ గొల్చుచుండు రొక
మానిసి దాహము దీర్పనెంచి, గం
గానదివీడి బావి నొగి
గాంక్షయొనర్చెడు చందమయ్యెడున్
దీనజనావనా! వినుత
దివ్యమహత్త్రతేజ! శంకరా!

మ. సుగమంబయ్యెను పూర్వకాలముననే
శుద్ధాత్ముఁడో వాఁడో యీ
నగభూమిస్థలియందు నిన్ను నిలిపెన్
నానాడు భక్తాళికిన్
తగదాక్షిణ్యము చూపుచుంటి పరమా
త్మా! నీలదుర్గేశ్వరా!
నిగమార్థప్రతిరూప! మ్రొక్కెదను శ్రీ
నీలాద్రినిత్యోత్సవా!

మ. సతియంచున్ సతుఁడంచు బంధులనుచున్
సన్మిత్రులం చెప్పుడున్
మతినూహింతురు నీదు మాయ నెవరై
నన్ దాటఁగా నేరకన్
క్షితిసంసారనితాంతమోహపరివి
చ్ఛిన్నాత్ములై దేవ! యే

గతి రక్షింతువో! నీకు దాసుఁడ మహా
కాళేశ్వరా! శంకరా!

ఉ. నమ్మితి దిక్కు నీ వనుచు
నమ్మితి భక్తులఁ బ్రోతువంచు నే
నమ్మితి సర్వసాక్షివని
నమ్మితి నీదగు పాదపంకజం
బిమ్మగఁ బూజసేయ మది
నెంచితి నేగతి నన్ను గాతువో
యిమ్మయి జ్ఞానసంపదల
నిచ్చుచు నీలగిరీశ్వరా! హరా!

మ. కరముల్ మోడ్చి లలాటభాగ మిల సో
కన్ మ్రొక్కి కీర్తించెదన్
స్మరహారీ! భవదీయ సత్కథల నీ
సంసారబంధమ్ములుఁ
పరివిచ్ఛిన్నతనొంది ముక్తిపడయన్
వాంఛించి సద్భక్తిమై
ధర నీలాచలనాథ! దీనజన స
ద్బంధూ! శుభంభావుకా!

ఉ. నీ శివరాత్రియుత్సవము
నిశ్చలభక్తిని జూడఁ బ్రోతి సం
కాశిత దివ్యవైభవని
కాయమహాత్మ్యరసన్నివేశమో

ఋూశ! ఘటించె మైమరపు
నేవో గుణాగుణయుక్తపద్యముల్
ఆశువుగాఁ బ్రివాహముగ
నయ్యెను నీదయచేతఁ శంకరా!

సీ. శ్రీమహోర్వి తీర్థయాత్రలు సేయఁగానేల
యజ్ఞయాగాదుల వ్యసనమేల
దానాలు ధర్మాలు తానొనర్పఁగనేల
సత్రనిర్మాణంబు సలుపనేల
అత్యున్నతంబైన యాలయశ్రేణులు
మిక్కిలి శ్రమను నిర్మింపనేల
అల్పవాయువు మాత్రమాహారించుచునుండి
యెముకల ప్రోవౌచు నెసఁగనేల

తే. ఇంపు నింపు చెఱువులు త్రవ్వింపనేల
వనచయంబును నాటించు పను లవేల
నిన్ను నిశ్చలభక్తి ధ్యానించు నెడల
నీలగిరిలోల! కరుణరసాలవాల!

మ. నవరత్నాంచిత భర్మహారధరుఁడై
నాగంబు తల్పంబుగాఁ
బవళించున్ హరి చూడ, దివ్యమహిమా
వ్యాకోచపద్మంబులో
న, వసించున్ విధి, నీ కిదేమిర శ్మశా
నంబా నివాసం బహో!

శివ! నాకును మాత్ర నచ్చదిది కా
శీనాథ! నీలేశ్వరా!

కం. కందములేని నభంబును
కందముపొందికయె లేని కావ్యంబును స
త్కందము లేని తటాకము
లందంబును గూర్ప వెందు నంధకవైరీ!

కం. ముందటి దినములు పోయెను
బృందారక పూజలెల్లఁ బెలవ యయ్యెఁ
గ్రందుకొనె దురాచారము
లెందెందున్ వెదకిచూడ నిందువిభూషా!

ఉ. నీదు మహాత్మ్య మేమియొ గ
ణింపఁగలేమని నిన్ నుతింపఁగా
నాదు కవిత్వ మెంతయును
నవ్యఘటంబును బోలె నెప్పుడు
త్పాదితమై స్రవించెడిని
తాఁ దనివోవ దయేవిధంబునన్
బాడుకొనంగ భక్తిరస
భావము సల్పుము పార్వతీపతీ!

మ. శివుఁడే దేవుఁడు దేవదేవుఁ డని వా
సిన్ భేరికా ధంధణా
రవసంఘాతము సర్వదిక్కులను పూ
ర్ణంబౌనటుల్ చేయుదున్

భవదీయప్రతిమానపున్మహిమముఁ
వ్యాపింపఁగాఁ జూతురా
భువిభక్తాళి వశంకరా! వరద! శం
భో! నీలదుర్గేశ్వరా!

మ. అలకన్యం దతి నిష్ఠమైఁ దపము సే
యన్ మేనిపైఁ బుట్టఁ బు
ట్టలు దానన్ వెదురుద్భవించెనట యా
తావున్న చో దాని ము
క్కలు తోడన్ విధి మూడు సాధనములం
గావించి సంప్రీతిఁ జి
న్నెల నీకిచ్చెఁ బినాక నామమిడి శ్రీ
నీలాద్రివాసప్రియా!

మ. హిమశైలంబును జేరి లోకహితముఁ
జింతించి తానుండఁగా
విమలధ్యానమునందు గోపితతి ని
ర్భీతిం బ్రవర్తింపఁ గో
పముఁ బూనంగఁ బితామహాది విబుధుల్
ప్రార్థించి శాంతింపఁ జే
సి, మహాదేవ! వృషమ్ము వాహనముగాఁ
జేయం బ్రమోదింపరే!

కం. పంటిని బుట్టినపోటును
కంటనుబడినట్టి నలుసు కాలున ముల్లున్

ఇంటను సతిపోరును ము
క్కంటీ! భరియింపనౌనె కాలునకైనన్.

తే. కృతయుగమ్మునఁ దపమును త్రేతయందు
యజ్ఞయాగాదికృత్యముల్ ద్వాపరమున
దైవసేవయు స్మరణమాత్రంబె కలిని
ముక్తిఁగూర్చు నండ్రు నాగభూషణుండ.

మ. నిరతంబున్ మదిలోన నిన్దలచుచున్
గీర్తించుచున్ బాడుచున్
పరచింతారతి యింతలేక తరియిం
పన్ రాని సంసార దు
స్తరజంజాటము వీడి యోగవిషయ
స్థానంబులన్ దన్మయ
త్వ రసాంభోనిధి మున్గువాఁడె నిజత
త్త్వజ్ఞాని నీలేశ్వరా!

ఉ. ఎన్నగ సన్నుతుల్ సలుప
నే నియమంబులులేవు భక్తియొం
డున్నను జాలుఁ గర్మల స
ముత్కరమే గద ముఖ్య మెప్పుడున్
నిన్ను దలంచుటే తపము
నేమము భక్తియె ముక్తి నిచ్చునో
పన్నగభూష! యీశ! భవ
బంధవిమోచన! ఫాలలోచనా!

మ. పులితోల్దాలుప! చంద్రశేఖర నిన్నుం
బూజింతు రక్షింపరా!
కలిమిన్ భోగము భాగ్యవైభవములన్
గాంక్షింపరా! నీకృపా
కలితప్రేక్షణ మొందు దక్కఁ నిఁక భ
క్తవ్యాధివారింపరా!
నెలతాల్పా! నగజాధిపా! గిరిశ శ్రీ
నీలాద్రి నాట్యేశ్వరా!

మ. అనిలో భక్తుఁడు పార్థుఁడే గెలువఁగా
నాశించి దివ్యాకృతిన్
మునుముం దీవు త్రిశూలపాణివగుచున్
బోవంగ నా శత్రువుల్
కని ధైర్యంబును శక్తిఁ బాసి యవలీ
లం బార్థుచేఁ జావరే
కనగన్ భక్తవశంకరుండవుగదా
గౌరీమనోవల్లభా!

ఉ. స్వామిహితార్థకామివయి
భాసురభక్తిని నిన్నుఁ గొల్వఁగాఁ
బ్రేమచిగుర్ప ద్రోణసుతు
రేపియు నాతని నిస్తులానుకం
పామతిఁ జేరదీయవె యు
పారకృపాకర! సద్దయామతిన్

మామకవాంఛదీర్పఁగదె
మంజుల నీలగిరీశ్వరా! హరా!

ఉ. దేహధరుండు నాశగతిఁ
దేరఁడు చిక్కఁడు పంచభూతస
మ్మోహపుఃబాశమం దడుగు
మోపడు తగ్గడు హెచ్చఁ డెప్పుడున్
హే! హిమశైలవాస! దివి
జేశ్వరవందిత! కావు మీశ్వరా!
యూహికభూష! దీనపురు
పావన! నీలగిరీశ్వరా! హరా!

ఉ. పోలగ నాత్మయొక్కటియె
మూలము మోహము గాన నీయ దీ
స్థూలశరీరమందెపుడు
సుస్థిరుఁడై చును జీవుఁ డుండి భూ
తాలకు లొంగఁ బోకను స
దా వెలుఁగొందును నిర్వికారుఁడై
నీలగిరీశ! దేవ! భవ!
నిర్గుణ! సద్గుణ! ఫాలలోచనా!

సీ. సత్కృత్యములు కావు సాధుజనములకు
దుష్కృత్యములు వాపు దుర్జనులకు
నాస్తికత్వమ్ము ఘనమ్మగు భక్తునిం
దయు ద్వంద్వసంఘర్షణంబు చేత

నవతారములునీకు నల పూర్వకృతదుష్కృ
తములను పుట్టువుల్ తనరు మాకు
కర్మఫలముల మార్గమున మాజన్మంబు
కర్మాతీతుఁడైఁ గ్రాలు దీవు
తే. మాదు దేహముల స్థితి యిమ్మాడ్కి నుండఁ
బ్రకృతికి నతీతుఁడవు నీవు ప్రకృతి కెప్డు
దాసులము మేము సుంతమాత్రంబె వాసి
నీలగిరివాస! శంకరా! నీకు మాకు.

ఉ. భక్తులు నాల్గువర్గములు
బాధల నొందెడువారు సత్సుఖా
సక్తులు మించి పూర్ణమగు
జ్ఞానము గల్గినవారలు సదా
ముక్తిని గోరువా రనఁగ
భూమిఁ జరింతురు వారు దేవ! నీ
భక్తులు శంకరా! సతత
భక్తవశంకర! నీలకంధరా!

ఉ. భీకరయుద్ధరంగమున
విస్మృతభక్తిని నిన్నుగొల్వఁగా
వీకదలిర్ప మున్ను రఘు
వీరునిఁ జేరియు నీప్సితార్థముల్
చేకుఱఁజేసి నట్టి కృప
చేకుఉదృష్టిని నన్ను బ్రోవుమా!

శ్రీకర భక్తసంచయవ
శీకరకైకహృదంబుజా! హరా!

మ. నరసంచారవిహీనమౌ భయదసాం
ద్రారణ్యమధ్యస్థభూ
ధరసామీప్యమునందు నొక్కఁడవు బా
ధల్ పొందగా నేల యీ
కరణిన్ నీవయి యిట్టులుండ నిఁక లె
క్కా పత్రమా! మేము శం
కర! లోకేశ్వర! సర్వభూతనిలయా!
కల్యాణపాథోనిధీ!

కం. తెల్లనివాఁడవు సద్మము
తెల్లనిదా వెండికొండ తెల్లనియహియున్
తెల్లని యాభరణంబును
తెల్లని దైవంబ తేటతెల్లం బయ్యెన్

మ. కలలోనైనను జూపుమొక్కపరి శ్రీ
కైలాసవాసా! విని
ర్మలరూపంబును జూడ వాంఛకలిగెన్
మాయమ్మ సామేనితోఁ
దల గంగాసతితో సుధాకరునితో
దైవారు నీరూపమున్
పులిచర్మాంబరధారి! కావు మిఁక శం
భో నీలకైలేశ్వరా!

మ. దనుజుల్ సిద్ధులు సాధ్వ్యాలున్ మునివరుల్
దైత్యారిసంఘమ్ములున్
నినుబూజింపఁగ వచ్చినారు వరదా!
నీవింక మేల్కొఁగదే!
కనరా! పార్ద్రీశ మెఱ్ఱవాటెఁ గదరా!
కాసంత కన్విప్పరా!
ఘనభక్తామరకల్పభూమిరుహమా!
గౌరీమనోభృంగమా!

ఉ. రామకథాసుధారసము
రమ్యముగా గిరిజాకుమారికిన్
బ్రేమ మెలర్పఁ గోల్పుచును
బ్రీతిగఁ దారకమంత్రశక్తి యౌ
న్నై మహిమమ్ములన్ నుడువు
చద్భుతరీతిని లోకరక్షణా
శ్రీ మెఱయంగ నివ్వటిలు
చిన్మయు నీలగిరీశుఁ గొల్చెదన్

సీ. సర్వభూతాత్మఁ ద్రిజగదాత్మ భద్రాత్మ
నిర్గుణాత్మ మహాత్మ నిర్మలాత్మ
త్రిజగదీశ్వరు మేరుధీరునిఁ జంద్రిమా
ళీశ్వరు సర్వేశు నీశ్వరేశు
నిగమస్వరూపు వినిర్మలచిద్రూపు
నిర్ధూతకల్మషు నిగమభూషు

యోగనిద్రానందు యోగివంద్యు ఘనవే
దాంతవేద్యు మునిహృదయనివాసు
తే. ఫాలనేత్రుని నసమాన భవ్యచరిత్రు
నాదిమధ్యాంతరహితుని నఖిలమాన్యు
నాయనంతు నుతింతు నిరంతరంబు
నీలగిరిలోల! కరుణరసాలవాల!

చ. అనిశము భక్తులందఱు శి
వా! యముఁగాపర యంచు నార్తిమై
నిను బలుమారు వేడుకొని
నిశ్చలభక్తినిఁ బారవశ్యతన్
మనముల పొంగుచుండిరి సు
మా! యనుమానము గల్గనీకయే
పనిగొని ప్రోవుమా! దయను
పాపవిమోచన! ఫాలలోచనా!

సీ. ఏ దేవదేవుని యుద్ధమహిమచేత
భూరివిషము వెన్నముద్దయయ్యె
ఏ దేవు కోపంపుటీక్షణప్రసరణ
మున రమాపుత్రుండు బూదియయ్యె
ఏ దేవు కరుణాప్రసాదమ్మునన మౌని
శేఖరుండును జిరంజీవియయ్యె
ఏ దేవు దయచేత హిమకరుఁ డాత్మీయ
శిరమున వసియించు స్థితియు నయ్యె

తే. అట్టి దేవదేవుని మహిమానుభావు
సత్త్వభావు! నీశ్వరు లోకజాలపాలు
పార్వతీహృదయవిహారు భవవిదూరు
నీలగిరివాసు నుతియింతు నిష్ఠతోడ.

సీ. ఊహ యెఱుంగక యుండి తుందుడుకుమై
పాపకార్య మొనర్చు బాల్యమందు
కాంతాకనకములఁ గాంక్షించి కామాంధ
తను సంచరించు యౌవనమునందు
గతకృత్యముల నెంచి మతియందు చింతించి
మసలుచుండు నల కౌమారమందు
అవయవపటిమమ్ము నంతరింపఁగ మతి
దప్పి చరించు వృద్ధాప్యమందు

తే. దిక్కు మొక్కును లేక నిన్ దేవురించు
దిక్కులేనివారికి నీవె దిక్కుగాన
దిక్కులేదును నీవె యో దీనరక్ష
నీలగిరిరథారూఢ! నన్నేలుమయ్య!

కం. అధముఁడ విజ్ఞానంబున
నధముఁడను వివేకమందు నన్నింటి యందున్
అధముఁడ నధికుఁడవగు నిన్
విధి నియతి నుతింతు నెపుడు విశ్వశరణ్యా!

కం. తల్లీ! నీవె యెఱుంగుదు
పిల్లల నేరీతి సాకి పెంచుటయో నీ

వల్లభు చెవిలో నూఁదుమ
పిల్లల బాధ్యతను నెత్తిఁ బెట్టుకొనంగన్

కం. వలిమల యల్లుఁ డెఱుంగఁడు
శిలపయియునికియె గలుగుటచేఁ దల్లీ! బి
డ్డలఁ గాపాడెడి బుద్ధిని
యలవడఁ జేయుము భవాని యా శివున కిలన్.

కం. నాలుగవజాము తప్పక
నీలగిరిశిఖరమునందు నిక్కము చెలఁగున్
లీలగ మంగళరవములు
మేలుకొలుపు లట్లు సతము మిహికాద్రిసుతా!

కం. ఎన్నెన్ని యద్భుతమ్ములొ
యన్నగసీమను వినఁబడునందురు నేడున్
పన్నగభూషణ! నీ వా
పన్నుల పాలిటికిఁ బెద్ద పాతువు గదరా!

మ. భవబంధమ్ములఁ జిక్కి సంతతము ఖిన్నో
భంజెందు పంచేద్రియో
ద్భవ మాయాపరిపూర్ణమోహతమమున్
భగ్నంబు గావించుచున్
భవదీయోజ్జ్వలపాదపద్మయుగళీ
ప్రఖ్యాతసేవావిశే
ష, వికాసంబును సంతరింపగదరా!
సర్వజ్ఞ నీలేశ్వరా!

ఉ. మంత్రియుగమ్ము వోయె విసు
మానములెన్నియొ యుప్పతిల్లె నీ
యంత్రయుగమ్మునందు నిజ
మారయుటే కలవాయెఁ బెక్కుడు
స్తంత్రములున్ ఘటిల్లె నయ
ధామముఁ గూలెఁ ద్వదీయరక్షణా
తంత్రిబలమ్ము చూపుటకుఁ
డొక్కనెఁ గాలము చంద్రశేఖరా!

మ. ధనవంతుండు కుబేరుఁ డాహితుఁడు మి
ధ్యామధ్య యయ్యాదిశ
క్తి నగాత్మోద్భవ భార్య, విఘ్నపతియున్
గీర్వాణ సేనానియున్
అనుగుంబిడ్డలు వెండికొండయె స్వకీ
యాగార రాజంబు నీ
లనగేశా! విసమేల? బిచ్చమది మే
లా? నీకు వాక్రువ్వుమా!

మ. వరదా! శంకర! నీవు దక్క నితరా
స్వాప్నదు లెవ్వారు దు
స్తరసంసారభయానకాంబునిధినిన్
దాటింపఁగా లేరు! నీ
చరణాంభోరుహ నౌక యొక్కటె కదా!
సత్సాధనంబయ్యెడున్

పురవిధ్వంసక! పార్వతీరమణ! శం
భో నీలదుర్గేశ్వరా!

మ. అరయన్ గ్రుడ్డికి గ్రుడ్డియే దొరకె సా
యం బన్న సామ్యంబునన్
పరమాయాపరిపూర్ణచిత్తమగు దే
వవ్రాత మింకేల సుం
దరమూర్తి పరిపూర్ణరక్షణకళా
ధారేయమ్మైనట్టి నీ
శరణంబే ఘనసాధనంబుగదరా!
శంభో! దయాంభోనిధే!

ఉ. మోసపువేషధారులయి
ముక్కులుమూసి వనమ్ములందు స
న్యాసులవోలెఁ గూర్చొని య
నారతమున్ బరవిత్తకామినీ
ధ్యాసయు హింసయున్ గొను దు
రాత్ములపైఁ బ్రసరింపజేయు నం
త్రాసము డుల్చి యగ్నినయ
నమ్మను నీలగిరీశ! యీశ్వరా!

చ. తను తరియింపలేఁడు మరి
తాఁ బరులం దరియింపనేర్తు నం
చును వెడ బింకముల్ పలుకు
చున్ ధనమెల్లను మెల్లమెల్లగాఁ

దనపరముం బొనర్చు కొని
తద్దయుఁ గన్నుల దుమ్ముగొట్టి క్రూ
రనరుల కేజగమ్ము, త్రిపు
ర ప్రభు! యిల్లమెనయ్య యీశ్వరా!

ఉ. న్యాయము తప్పకుండను ద
యాగుణసంపద గల్గి మించి యా
మ్నాయవిధిప్రకాండము ల
నారత మాచరణం బొనర్చి సు
శ్రీయుతమూర్తియై మిపుల
జెన్నసలారెడు వాఁడె మానవుం
డేయెడ నేఁ ద్విపాద్పశువ
యే యగులేనియెడన్ గిరీశ్వరా!

మ. పరులైశ్వర్యసమేతులైన భరియిం
పం దాల్మి లే కీసులై
ధర నెన్నన్నియొ గొప్పవన్నగడలన్
దైవారఁగాఁ జేసి వే
తుర! సర్వేశ! యసూయపెంపెసఁగె బు
ద్ధుల్మారెఁ బోమంచియే
యరయన్ జెడ్డగఁ దోచు రోజు లివి నీ
లాద్రీశ్వరా! శంకరా!

ఉ. నమ్మకపోయె నీతియును
న్యాయము ధర్మము సత్యశౌచముల్

వమ్మయిపోయె లంచముల
పాలును పన్నులపాలు ఘోరదుః
ఖమ్ములపాలు మానవుల
కష్టపుజీవితగాథ లెల్ల తే
లెమ్మిక దుష్టశిక్షకు బ
లే సమయమ్మిది పార్వతీపతీ!

ఉ. రాజులు నస్తమింపఁ గవి
రాజుల శీవి యడంగ దివ్యభా
షాజవముఁ దొలంగెఁ దొలి
శక్తులు యుక్తులు నామమాత్రమై
తేజము డిందె వస్తువుల
తేకువ మందులపొందు పొందె హ్రా
ద్రాజియు భగ్న భగ్న మని
రాఁజు నిదంస్థితి సోమహేశ్వరా!

ఉ. మానవసంశయామయ స
మాజపుదూదికి నిప్పు నీవ! యీ
దీనజనావనమ్మునకు
దీక్షవహించిన దేవుఁడీవ! నిన్
పూని భజించు భక్తజన
పుంజము భగ్నమనోరథాత్మతన్
పూనదు పూనదుఁ మరియుఁ
బూనదు నీలగిరీశ్వరా! హరా!

ఉ. చీఁకటి వెంబడిఁగ వెలుగుఁ
 జెచ్చెరఁ జొచ్చుట నిక్కమా, నిశీ
ధాకర వన్యసీమల హి
 మాంబువు గ్రోలుచు యోగనిద్ర ము
ద్రాకరమూర్తివై రహిం వి
 రాజిలు ని న్పసిగట్టె నీ ప్రజా
నీకము స్తోత్రముల్ వెలసె
 నీపయి నీకిఁక దాఁగ శక్యమే!

ఉ. భీకర వన్యసంయుత గ
 భీర మహీధర గుహ్యాతస్థలుల్
బ్రాకి భవత్సభప్రథిత
 భాసురరూపసుదర్శనం బిలన్
జేకొనఁబోదుమా! తెలిసి
 చేరుదు మెచ్చటికైన వింటివా!
ప్రాకటదివ్యతేజ! నిజ
 భక్తవశంకర శంకరా! హరా!

కం. ప్రారంభమున నిను బొగడి
యారంభము సేతు నితరయంశము లెల్లన్
ఆరసి నను గరుణామతిఁ
బారము నొందింపవయ్య! భవ! భూతేశా!

మ. నిను వర్ణింపఁ గడంగుచో నిల భవా
 నీనాథ! భావంబులుఁ

పనఁగొంచుణ్ నను హర్షసాగరనిమ
గ్నస్వాంతుగాఁ జేసెదుణ్
యనుమానం బదియేల నియ్యది భవ
ద్వ్యాలోలసద్వీక్షణా
ఘనకారుణ్యరసప్రకార మనఁగా
గౌరీమనోవల్లభా!

శా. శ్రీమద్దివ్యమునీంద్రసేవ్యపదరా
జీవా! కృపాసాగరా!
ధీమత్సన్నుతసత్ప్రభావకలితా!
దీనావనా! స్తోత్రసు
త్రామా! వహ్నిదినేశచంద్రనయనా!
ప్రార్థింతు మత్కావ్యమున్
ప్రేమారంగఁ జిరాయురున్నతుల వ
ర్థిల్లం గటాక్షింపగన్.

మ. నరసంచారవిహీనవన్యనగముణ్
నాట్యేశ్వరావాసమై
పరమప్రాభవపూర్ణమై నెగడుటల్
భావించి మోదంబుతో
నురుభక్తి న్మదిసందడింప నిట న
ధ్యోత్సాహులై భక్తులున్
తిరణాలం జరిపింపఁ బూనిరిఁక సు
త్తేజంబునన్ సాగుతన్.

మ. నినుసేవింపఁ దలంచి సుస్థిరమతిన్
విశ్వేశ! నాశక్తియున్
వినియోగించి భవత్కటాక్షమున తృ
ప్తింబొంది సద్భక్తిమై
వినుతింపం బనిఁబూని తిందుఁ గొనుమా!
వీక్షించి దోషంబులన్
అనుకంపన్ విడనాఁడుమయ్యా! శివ! నీ
లాద్రీంద్ర! విశ్వంభరా!

సీ. అభవ! భవద్దివ్యతాగమభాగ్యంబు
నుత్సాహవిభవసముత్సుకతన
దానధర్మప్రమోదమతులౌ పరిసర
ప్రాంతపుణ్యాత్ముల భక్తికతన
మధురసుధానిధుల్ మలయించు సత్కవి
భావస్తోత్రప్రభాప్రతిభకతన
భక్తిశ్రద్ధలు మదిఁ బారాడఁ బాల్గొను
మూఢజనుల శుద్ధబుద్ధికతన

తే. అల పరితాపరుదిమహేశు కొలువ నీల
నగవిభవ మిల నేఁడు కనుఁగొనఁ జేసి
యలరు తెలఁగాణమం దేకయసదృశఘన
పుణ్యభూమిగా నీలాద్ర్యరణ్యతలము.

మ. భవదాకారము హృత్పుటంబున సదా
భక్తి న్విచిత్రీకరిం

చి విశుద్ధాత్ముఁ దపస్సపర్యల నిరుల
సేవించి నిష్ఠామతిఁ
వివిధావస్థల కోర్చి సిద్ధిఁగొనియున్
వెల్గొందు మానీశ్వరుల్
భువిభక్తాళివశంకరా! వినుతశం
భో! నీలశైలేశ్వరా!

సీ. జయ జయ శంకర! సాధువశంకర!
దుష్టభయంకర! దురితదూర!
జయ జయ పార్వతీశ! హిమశైలనివాస
నాగవిభూష! సన్మానిపోష!
జయ జయ ఫాలలోచన! భవబంధవి
మోచన! పురధ్వస్తమృదులహస్త
జయ జయ భద్రాత్మ! సర్వాత్మ! విమలాత్మ!
వేదవేదాంతసంవేదవేద్య!

తే. సుజనసంరక్షణాక్షంత కుజనహంత
చంద్రసూర్యానలత్రినేత్ర! స్తవచరిత్ర!
విమలయోగిహృద్యానంద! విశ్వతుంద
సంతతజగదాధార! సంసారదూర!

కం. విసువు విరామము లేకను
పసు, శిశు విధమున వదలక భక్తిని నిన్నుఁ
విసమేతరి! కొలిచినవోఁ
బసగూర్తువు గాదె ముక్తిఁ బాపహర! హరా!

సీ. ని న్నినుతించిన నెపమున శంకరా!
నవ్యమై దనరారు నాదునాల్క
ఉత్సాహమలరంగ నున్మతిప్రాయుట
ధరపుణ్యతరములౌ గరము లరయ
నీ నామమననచే నెమ్మిగ మాలిన్య
రహితమై గ్రాలు ధరణి మనంబు
జగమెఱుగంగ నీ సరణి వెలువరింప
బూనుట బ్రతుకిల బూజ్యమయ్యె

తే. ధన్యమైన నాజన్మంబు ధరణిలోన
బాపపాశాల బంధింప బడని యట్లు
కరుణ వరమిమ్మయా నీలగిరినివాస!
భక్తి మ్రొక్కెద ననయంబు ఫాలనయన!

తే. ఆత్మవిశ్వాసమే ముఖ్య మందు రట్లు
గాన పూర్ణవిశ్వాసముఁ గడలుకొనగ
పల్కినాడను నే నిట్లు పార్వతీశ
నీలగిరివాస! కరుణరసాలవాల!

శా. దేవా! హే! మహాదేవ! దేవ! త్రిగుణా
తీతా! పురధ్వంసకా!
దైవాధీశ! శశాంకభూష! నిజభ
క్తస్వాంతమందారమా!

భావాతీత! మనోనివాస! నగజా
భామామణీహృద్విహా
రా! వారాశిగభీరధీర! మునిహృ
ద్రిమ్యాబ్జవాసా నమో!

ఇది శ్రీ చక్రవరం వేంకటరామరాయగురు కరుణాకటాక్ష
లబ్ధ కవితాధారేయ కాశ్యపసగోత్రపవిత్ర
కపిలవంశాంబుధీసుధాకర శ్రీ కామేశ్వర
సూర్యనారాయణార్య ప్రియమధ్యమ
పుత్ర శ్రీకృష్ణశర్మ నామధేయ
ప్రణీతంబగు శ్రీ నీలాచలేశ్వర
స్తవము సర్వము
ఓం తత్సత్.

